# సంగీత నాపసాని



పున్నవ లక్ష్మీనారాయణగారిచే

రచింపబడినది

1933

వెల 0—1—0

# సంగీత నాపసాని

(కవి తిక్కనయొక్క కూతురు గాయత్రిదేవి. ఈమెకు నాగసాని యని ముద్దుపేరు. ఈమెకు గల యద్భుత సంగీత జ్ఞానముచే సంగీత నాపసాని యని మారుపేరు వచ్చినది. ఈమెకు బంగారువంటి దేహచ్ఛాయ గలదు గనుక కడాని అని కూడా పేరుగలదు. ఈమె తల్లిపేరు సీతమ్మ. ఈమె బాల్యచరితములు కొన్ని యిందు వర్ణింపబడినవి. ఇది తిక్కన యను నవలనుండి క్లుప్తీకరింపబడినది.)

## I

(నాగసాని ప్రవేశము)

నాగ— అమ్మా? నాన్న యింకా రాలేదేమే? నేను అమ్మమ్మ గారి వూరినుండి వచ్చానన్న సంగతి తెలియలేదు గామాలె. నేరాంగనే కబురంపలేదా:

సీతమ్మ—నీవేమి రాణివా? రాంగనే రావడానికీ; కబురంపడానికి.

నా— నేను అంత మీకు కాబట్టకపోతే మళ్ళి పంపించివెయ్యి.

సీ— నీవు మాకు కావలసినదానవేనమ్మా! మా బంగారు కొండవు. నీవు లేకపోతే ఉండలేకగాదూ, మనిషిని బంపించి పిలిపించుకొన్నది.

నా— మీయింట్లో నేనుండలేను. నాతోటలోకిబోయి ఆడుకుంటూ, నాన్న రాంగనే పిలువు.

సీ— తోటలో ఏంపార వేసుకున్నావు? పొద్దుగూకులూ తోట బట్టుకొని దేవులాడతావు. పది రోజులనుంచి నిన్నుజూడక మొగము వాచియుంటేన్ను.

నా— మీరు నాతో ఆడుకోరు, మీకు పొద్దుగూకులూ ఒకటేపని. మామిడిగున్నలు, కోకిలమ్మలు, సీతాకోకలు తుమ్మెదలు ఎప్పుడూ ఆడుకుంటూ పాడుకుంటూ ఉంటవి. వాటితోనే ఆడుకుంటాను.

(తోటలోకి పోతుంది)

—♦ తో ట పా ట ♦—

నాగసాని:—

(1) మావిగున్నమీద - మరుగున దాగుండి,
పీకెను పూదేటి - కోకిలమ్మా?
బుల్లి బుల్లి యిగుళ్లు - గిల్లి నీకూబెట్టి
గొంతు చక్కగజేతు - కూయవమ్మా. మా॥

(2) మల్లెపూరెక్కల - మాటున నక్కుండి
తూ-అని పాడేటి - తుమ్మెదమ్మా?
తీయని పూదేనె - తీసి నీకూబోతు
కలరవమున సుతి - గలుపవమ్మా. మా॥

(3) తోకవిప్పుకోని - తాకిట ధిమ్మని
తైతక్క లాడేటి - నెమిలమ్మా
గురివింద పూసల - కుతికంటు జేయిస్తు
అల్లిబిల్లి నాతో - ఆడుకోవమ్మా. మా॥

(4) అంబరమార్గాన - అల్లలనాడుచు
వుయ్యాలలూగేటి - తీగెసాని,
చేతిలో చెయిబెట్టి - చెట్టపట్టాల్ బట్టి
తెమ్మెరగాలికి - తిరుగరమ్మా. మా॥

అబ్బబ్బా వెమరుగుమ్మా, నోరు నొప్పిలేకుండా ఎప్పూడూ పిల్లనగ్రోవి ఊదుతునే వుంటావు, కంచునోరే నీది, తుమ్మెదా! ఏదీ సా-బట్టు.

తు—సా—

నా:— మన గొంతులు రెండూ ఒకటేనే, నీవు కాస్త ఆపు. కోకిలా? నీవు, పా-బట్టు.

కో—పా—

నా— శా— బాగుంది. మామిడిచిగుళ్ళు బాగాదిని సాఫుచేసుకొన్నావు, గొంతు. యెప్పుడూ ఆయెత్తున పాడుతావు. యెలుగు రాయదటే.

నీ మూడో. పా. నాకు అందదమ్మా

అదుగదుగో నెమిలి ఆడుతున్నది ఆడు, ఆడు, బాగా ఆడు. తకిటధం, తకిటధం, (అంటూ తానుకూడ ఆడుతుంది.) వుండుండు

సీతాకోకా. నీకలంకారి పావడా చూడనియ్యి. నా పరికిణీవి పెద్దచుక్కలు. నీవి బుల్లిచుక్కలు. ఎగిరిపోకు. ఆ పువ్వుమీద కాసేపు కూర్చో. నీకు ఎక్కడా కాలు నిలువదు. తిపాసిలాగు తిరుగుతావని మీఅమ్మ చీవాట్లు పెట్టుతుందిలే. వంటినిండా పూలదుమ్ము పూసుకుంటూ వెందుకు? మీఅమ్మ కోపడదూ? నీళ్లు పోసుకో. పో.

అదుగో పాము—

యివ్వాళగూడా సంగీతం వినడానికొచ్చావా?

అవును నీకు పున్నాగవిరాళి యిష్టముకాదూ!

—◆ పా ట ◆—

ప ల్ల వి.

బేటా్రియిసామి దేవుడా నాయేల్నేవాడ ॥బె॥

అ ను ప ల్ల వి.

కాటామిరాయుడా కదిరి నరిసిమ్ముడా
నీశైనవేటకాడ నిన్నే నమ్మినవాడ

చ ర ణ ము.

చేపకడుపున చేరిపుట్టెగా
రాకాసిగాని—కోపానతీసికొట్టెగా
వోపినన్ని నీళ్ళలోను వొచ్చినీవుదాగివుండి
బాపనోళ్ళసదువులెల్ల బమ్మదేవరకిచ్చినోడ॥ బె॥

అబ్బా! యెంతచక్కగా తలతిప్పుతావే,
ఏకతాళానికి లయ అందేటట్టుగా పడిగెతిప్పుతున్నావు.
యిదిగోదీనికి తాళము వెయ్యిచూతాము.

—✻ పా ట ✻—

నాగా దిగురా నాతండిరి దిగురా॥ నా॥
దిగుదిగు నాగన్న దివ్యేసుందర నాగ॥
నాగా దిగురా, నాగదిగురా, నాగదిగురా|

చ॥ వూరికి వుత్తరాన, వూడ మట్టికిరింద
కోవఁపుట్టలోని కోడెనాగన్న॥ నా॥

అని పాడుతూ చేతితో తాళము వేస్తూ కాళ్లతో నృత్యము తొక్కుతూ పుట్టవైపుకు పోతున్నది.

తిక్కన సోమయాజి దివాణమునుంచి వచ్చాడు. బండి దిగి యింట్లోకి రాగానే నాపసాని వచ్చిందని తల్లి చెప్పింది. ముద్దు పేరుతో కడానీ అని కేక వేశాడు.

సీతమ్మ— యింట్లోవుంటే దానికి వంటిన చీమలు పారకాడి నట్టుగా వుంటుంది, రాంగనే చీలి? అని పిలిచింది, కూన దొడ్డిలో వున్నదిగామాలె, ఒకటే మోస్తరుగా అరుస్తు గదులన్ని దేవులాడుతున్నది.

తిక్కన— అంగరఖాపాగా దీసి వంకెకు తగిలించి కడాని కోసముతోటలోకి పోయినాడు. పాము ముందు ఆడ డం చూచాడు. కడాని, పాము, పాము, అని కేకలు వేసుకొంటూ పరుగెత్తుకొని వచ్చాడు. కడాని వాళ్లు మఱచి ఆడుతూ వున్నది. కేకలకు పాము బెదిరి పుట్టలో జొరబడ్డది. తిక్కన నాగసానిని యెత్తుకొని పుట్టకు దూరంగా పది అడుగులు వచ్చాడు. కడాని కండ్లు తెఱచి చూచింది. తక్కినదంతా మరచిపోయి నాన్న నాన్నని తండ్రిమెడ కౌగిలించుకొన్నది.

తిక్కన— తలమీాద చెయ్యిబెట్టి ఏమినాన్నో! మాకు దక్కే అమ్మవు కావు. పాముమీాదికి పోతున్నావు. అది కరవదూ.

నా— కరవదు నాన్నా! దాన్నేమీా అనకపోతే. నే నెప్పుడూ దానితో ఆడుకోవడం లేదా? పట్టుకోబోతే పుట్టలోకి దూరుతుంది.

తి— నీ మొహం పాము నిన్ను కరవక ముద్దుపెట్టుకుంటుందీ?

నా— సరే. ఇక నే నేమి జెప్పేది.

తి— నాగసాని నెత్తుకొని ఇంట్లోకి వచ్చాడు.

సీ— యెందు కీమె చంక కెక్కింది?

తి— యెందుకా? యీపాటికి కొంప గుభేలుమనేది. ఆడుకుంటు పాడుకుంటూ తాచుపామును ముద్దుపెట్టుకోబోతున్నది. నేను చూచి అద్దద్దా అని కేకల్లు వేస్తే అది పుట్టలోకి దూరింది.

సీ— దీని కిదేమి ప్రాలబ్ధము, పాములతో, జెర్రిలతో ఆడుకోవడం. మొన్న ఒక మాటు తోటమాలి కూడా చూచాడట. నేను నమ్మాలా. ఈ పిల్ల యేదో మన కొంప ముంచడానికే పుట్టింది. ఒక మాటిటు పంపించండి కౌగలించుకుంటా. పరికిణీ విడుస్తుంది లెండి. అని దగ్గరకుతీసి కండ్లనీరు పెట్టుకుంటూ ముంగురులు సవరించి-ఏం పిల్లవే. ఆ పాము కాటందితే యీ పాటికి మా కొంప యేమయిపోను?

నా— కాటందు తుందట? మీ రంతా ఒక టేమచ్చు, దాన్ని యేంచెయ్యకపోతే యెందుకు కరుస్తుంది? సంగీత మంటే దానికి ఉన్నయిష్టము నాన్నకు కూడా లేదు.

తి— యిక దానికి జవాబు చెప్పు. యీ అమ్మ మనను ఉద్ధరించడానికి మన యింట్లో అవతారమెత్తినది. అది

పుట్టినరోజే రాజుగారు నన్ను పిలిచి నీకు మంత్రిత్వ మిచ్చానయ్యా అన్నారు.

సీ— సరే. నలుగురు మనుష్యులను పెట్టి పుట్టను త్రవ్వించి పామును కొట్టించండి. అహోరాత్రులూ మనుష్యులు తిరుగుతుండే చోటు.

నా— అబ్బా! దాన్ని చంపవద్దరా. అది మిమ్మే నేమి చేసింది. మీకంటే అది మంచిది.

సీ— తెలిసివచ్చేది దాని మంచితనం, కరిచినట్లైతే.

నా— అది ఆ పుట్టలో లేదు. యింకా మీకోసం కనిపెట్టు కొని కూర్చున్న దనుకున్నారా?

సీ— దానివన్నిమయిదులు. చంపుతారని అట్లా చెప్పుతుంది.

నా— తవ్వించి చూచుకోండి.

తి— లేదని నీకెట్లా తెలుసునే. యిందాక దాంట్లోకేపోయింది గదా?

నా— నీవు గాబరాపడి నన్ను చంకపెట్టుకొని పరుగెత్తుతుంటే నేను అటే చూస్తున్నా! నీవిటు మళ్ళంగానే అది పడిగ వంచుకొని నక్కుతూ పేరెందిసింది.

సీ— దొరకకపోతేమానె. ఆపుట్ట తీసివేయించండి.

నా— సరే తవ్వించుకోండి మాకేం.

సీ— మాకేమట! పాము దానికి దగ్గరచుట్టమైనట్లు.

నా—నాన్నా నీవు నడువు. ఏకతాళంవేస్తూ.

తి— ఎన్నోకాలం వెయ్యమంటావు!

సీ— మీరు అది ఆడించిన ఆటలన్ని ఆడుతారు.

నా— నాన్న తాళము వేయనక్కరలేదు. నడుస్తుంటే ఏక తాళమే పడుతుంది. మామూలుగా నడిస్తే మొదటి కాలము. తొందరగానడిస్తే రెండవకాలము. పుట్టదగ్గర నన్నెత్తుకొని పరుగెత్తినప్పుడు మూడోకాలం పడ్డది.

తి— నేను గుండెలు కొట్టుకుంటూ బిడ్డ యేమైపోతుందో అని పరుగుత్తుతుంటే అది నా అడుగులు ఏక్కాలంలో పడ్డవో లెక్కపెట్టుతున్నది. యిట్లాంటి పిచ్చిఅమ్మ ఒక్కతుంటేచాలు, యిల్లు స్వర్గమవుతుంది.

సీ— సరే పదండి మనుష్యుల పిలిపించి పుట్ట త్రవ్వించి వేస్తా.

తి— ఎందుకులే,అమ్మడు వద్దంటున్నదిగా పాము వెళ్ళిపోయె ప్రపంచములో పాములేని చోటున్నదటలే.

సీ— శివు డెరుకలేనిది చీమైనా కుట్టదు. పోనియిలెండి.

## II

ఒకరోజున తిక్కన వైశ్యదేవంజేసి రామాయణం పారాయణం జేస్తున్నాడు. ఆరోజున వచ్చిన అతిథు లలో ఇద్దరు కాశీ పండితులు. పౌరోహితుడు అధిశ్రివ ణం చెప్పాడు. అందరు భోజనం చేస్తున్నారు. పక్క గదిలో పిల్లతో ఆడుకుంటున్న నాగసాని అన్న సూక్తం చెప్పడంలో లయ తప్పిందని కేకవేసింది. కొందరు పండితులు తప్పిందనీ కొందరు లేదనీ అభిప్రాయ పడ్డారు. ఘనాంతస్వాధ్యాయి అయిన కాశీ పండితుడు పౌరోహితుడు చెప్పింది మురికినాటి పాఠం అయివుం

టూం దనీ శాస్త్రీ పాఠం ప్రకారము ఆ అమ్మాయి చెప్పిందనీ ఐక్యంగా తీర్పుచెప్పారు. రెండవ శాస్త్రీ పండితుడు మురికినాటి వేదాధ్యయనమునకు క్రమ శిక్ష లేదని స్పష్టపరిచాడు. ఒక వృద్ధ బ్రాహ్మణుడు ఒక చిన్నసామవేదవాక్యంచెప్పి "తక్రాంతే చక్రధరస్మరణ" అని కేకవేశాడు. పులిమజ్జిగ తగలడంచేత గామాలె మధ్య గొంతు సుతితప్పుతున్న దని కడాని కేకవేసింది. అంతా దిగాలపడి చూచారు. వారిలో సామవేది ఆ వృద్ధబ్రాహ్మణు డొక్కడే కనుక తప్పె వరికీ తెలియలేదు. తర్వాత అందరు కచేరీ సావిట్లో తివాసీలమీద కూర్చుని తాంబూలం వేసుకుంటున్నారు. కడాని తండ్రి తొడపై కూర్చుండి పటికినార్చిన మేలిమి తీగవలె మెరుస్తున్నది. కనిముక్కులకుదిరిక గలమొగము ముద్దులమూటకట్టుతున్నది. లక్కబుర్రలె చిన్ననోరు. ముక్కున రవ్వలుచెక్కిన నలుసంత చంద్రరేఖ కండ్ల కాంతికి యీడుగావున్నది. కాలు కదల్చినపుడల్లా పిల్లాండ్ల మోత వినబడుతున్నది. కడాని తండ్రిమొగాన దృష్టినిలిపి చూస్తూ "నాకూ" అన్నది.

తి— వక్కపొడి యిందు. ఆకులు చుట్టిస్తాను.

నా— ఊఁహుఁ.

తి— వట్టి లవంగాలు వేసుకుంటావా?

నా— ఊఁహుఁ

తి— వక్కపొడిలోని కొబ్బరి ముక్కలు వేసుకొని తిను.

నా— ఊఁహుఁ

తి— మరి ఏమిటి నీ ఊఁ హూఁకు అంతులేకుండా వున్నది.

వృద్ధబ్రాహ్మణుడు— ఏనాటోటి వృద్ధ బ్రాహ్మణుని మీద నోకోటీ యిస్తున్నది. కనుక్కోండి

తి— చూచావా- నిన్ను తాతగారేమంటున్నారో కొంటె పిల్ల వంటున్నారు.

నా— కాదునాన్నా-చెప్పనా చెవులో-తమ్ముం.

తి— తప్పు. తప్పు. తాతయ్యాలు కొట్టి పోతారు.

నా— కొట్టరు. వాండ్ల అమ్మాయిలకు వాండ్లూ పెడతారు.

వృ— అదుగో నే జెప్పలేదు మన అందరిమీద ఎత్తింది ఏదోకోటి.

తి— చెప్పనా వారందరితోటి?

నా— వద్దు. వద్దు. (అని తండ్రి నోరు మూసింది.)

తి — చూశావా- తాతగారు నువ్వు సిగ్గులేని దానవంటున్నారు.

నా— (చేతితో చిన్నగా తండ్రి బుగ్గను కొట్టి) సిగ్గున్న దంటున్నారు.

తి— అయితే మరి చెప్పనా వారితో.

నా— చెప్పుకో.

తి— ఏక్కాలల్లా- ఈ అమ్మాయి తమ్ముం పెట్టు మంటున్నదండీ.

నా— ఏక్కాలల్లా- ఈ అబ్బాయి తమ్ముం పెట్ట నంటున్నాడండీ.

వృ— ఆ హా, నిజమె- మా అమ్మాయికి నే తమ్ముం పెడతాను.

తక్కినవారు— మేమూ పెడతాము మా అమ్మాయిలకు.

తి— అదుగో చూచావా నీ కోసం మహాపెద్ద లంతా కొత్త కాగితాలు చూపిస్తున్నారు

వృ-బ్రా- అయ్యా? ఒక్క మనవి. నేను కాశీలో ఒక మహా సభలో సామవేదంలోది ఇందాకటి ముక్కే అన్నాను కొందరు శృతి తప్పిందనీ, కొందరు శృతి కటువుగా ఉన్నదనీ, కొందరు సరిగా ఉన్నదనీ వాదించారు. అప్పటికి ఇప్పటికి ఆశృతి కటువుగావడమేమిటో నాకు బోధపడలేదు. శృతి కటువ యిందని కాశీ పండితుడు కొట్టు కొన్నచోటనే ఈగాయత్రిదేవి పట్టుకొని నొక్కింది. సత్యం మనవిచేసి నందుకు క్షమించండి. ఈమె కేవలం సరస్వతి.

తి— కడానీ తాతగారు నిన్నేమంటున్నారో తెలుసునా. కొంటెపిల్లవు, అన్నీతప్పులు పడుతుంటావు అని ఆయన అన్నారు.

నా— ఊఁ

## III

ఒకరోజు తిక్కన దినమంతయు రాచకార్యపు గొడవలలో కొట్టుకొని సాయంత్రం ఇంటికివచ్చాడు. రాచరికపుతికమలలోనుండి ఇవతల పడంగనే మనసు హరిహరనాథుడివైపో, కడానివైపో, పోవడం మామూలైంది. కడానిని సంస్కృతాంధ్రముల పండితురాలిని చేయిస్తే బాగుండునని యోచన తగిలింది. ఆడకురాలు ఎక్కువ శ్రమచేయలేదేమో. ఒకరిచేతిలో బెట్టి యుక్తవయస్సు రాంగనే పంపివేయవలసినదే కదా. సంసారంలో బడ్డ తరువాత చదువెక్కడ సాగుతుందనుకున్నాడు. కడానిని ఒకరికిచ్చిపంపివేయడమనే తలపు మనసుకు తట్టేవరకు గుండె గుబగుబమన్నది. వదిలిపెట్టి వుండగలమా

అనుకున్నాము. పువ్వు పూచిచెట్టుమీదనే ఎండి రాలిపోతే ఏమి ప్రయోజనమని మళ్ళాయోచించింది. వీలయితే వొకమంచి కుఱ్ఱవాడిని తెచ్చి యింట్లోనేవుంచి విద్యా బుద్ధులు చెప్పిస్తే మన కలికిపోతాడు. ఏదో ఇంతవుద్యోగము చెప్పించి వున్న ఆస్తిలో ఒక చెఱుగు వాడికి యిచ్చి యిస్తే సరిపోతుందనుకున్నాడు. మనసు స్థిమితపడ్డది. దుస్తులు తీసి తువాల పైన వేసికొని కచేరి సావిట్లో కిటికీకి సమీపంగావున్న తక్తా బల్లమీద బాలీసు కానుకొని కూర్చున్నాడు. కడాని పరుగు పరుగున వచ్చి తండ్రి నాలింగనము చేసికొని కసరుతు చేయుటచే కండలు తేరిన తండ్రి యొక్క వక్షస్థలమును, బాహువులను, చిగుళ్లవంటి వేళ్లగోళ్లతో పుణుకుతూ సంభాషణ ప్రారంభించింది.

తి— కడానీ: నీవు కాసేపయినా మాట్లాడకుండా వుండగలవటమ్మా?

నా— అట్లాగే వుంటాగాని నీవు యెప్పుడూ ఏదో ఆలోచించుకుంటూ, మొగము చిట్లించుకుంటూ నే యేదైనా చెపుతూవుంటే తిన్నగా వినకుండానే వింటూవున్నట్లు ఊఁ కొడుతు నామాట వినమని నీమొగము నావైపు తిప్పుకుంటే విసుక్కుంటూ వుండకుండా వుంటావా?

సీ— (ఇదంతా సీతమ్మవిని) మీయిద్దరితో నే పడలేకుండా వున్నాను. మీకు యేమిజెప్పినా చెవిదూరదు. ఎప్పుడూ పరధ్యానమే. అదేమో ఇతరులను మాట్లాడనీయకుండా నోరుకూడా మూసి పొద్దుకూకులు చెప్పుతుంటుంది. మీరు అప్పుడప్పుడూ నరప్రపంచములోకివచ్చి

మాట్లాడుతూవుండేటట్టూ, అది కొంచెము ఇతరులను కూడా మాట్లాడనిచ్చేటట్టూ, సమాధాన పడండి. అదుగో సంగీత పంతులుగారు, కొత్తగా కడానికోసం యేర్పాటు చేశారట. మధ్యాన్నమువస్తే మీరువచ్చిన తరువాత ప్రారంభించమన్నా.

పం— (ప్రవేశించి) నమస్కారమండీ. ఈపూట ప్రారంభించ వచ్చునన్నారు.

తి— అయన కావ్యాలుకూడా చెప్తారు. ఈ పూట సంగీతం, పొద్దున కావ్యమూ చెప్పండి. అదుగో తివాసీమీద కూర్చోండి. కడానీ, శృతికి తాంబూర తీసుకరా. సంగీతం చెప్పుకుంటావా?

నా— చెప్పుకుంటా

తి— తూర్పుగా తిరిగి కూర్చోని పంతులుగారికి నమస్కారం చెయ్యి.

(కడాని నమస్కారంచేసి కూచుంటుంది)

నా— తోటలో కూచోని పాడుకోగూడదండీ?

సీ— ఇక్కడ పనికిరాదా? ఇక తోటలోకి అడుగు పెట్టావా అంటే కట్టివేస్తాము.

పం— వద్దులెండి. ఇక్కడే చదువుకుంటుంది. సా— అనమ్మా.

నా— సా—

పం— సా. రీ. గా. మా. పా. ధా. నీ సా. అను.

నా— అన్నీ అన్నిరకాలుగా వున్న వే. అన్నీఒకఅక్షరముతోనే చెప్పగూడదా.

సీ— అన్నీ ఒక అక్షరముతో ఎట్లా చెపుతారే.

పం— చెప్పవచ్చును లెండి స్వరస్థానాలు బాగాకుదిరినవాండ్లు.

నా— ఎట్లా చెప్తారా? చూడు సా, సా, సా, సా, సా, సా, సా, సా.

పం— అబ్బో. ఈ యమ్మాయికి స్వరస్థానాలు మహాపండితులకులాగ కుదిరినవండీ

నా— పంతులుగారు. మనం తోటలోకిపోతే యివన్నీ వినపడతవండి.

పం— అక్కడెవరు పాడ్తారు ?

నా— పిట్టలు పాడుతవండీ, తలాఒక స్వరమూను. అవి యాకాశాన స్వరాలు పాడుతవి. అదుగో. అదుగో. తుమ్మెద, తూ-- అని మీ మొదటి సా, పాడుతున్నది. మీరు సా, అని అంటూవుంటే వంకరగీత లాగు అటూయిటూ పోతూంటుంది. అది వంపులేని తీగలాగ ఒక్కదీర్ఘం తీస్తుంది.

సీ— ఇక అది సంగీతం నేర్చుకొన్నట్టే యీ గురువుదగ్గర.

పం— ఆ అమ్మాయి సంగీతమూర్తండీ. స్వరసాధనే అవసరము లేదు. కీర్తన్లే చెప్పవచ్చు. లయజ్ఞాన మెంతవరకుందో చూతాము.

నా—నాకు తాళం తెలుసు. మొన్న భజనలో పాడిన కీర్తన లాగ పంతులుగారు నడుస్తారు.

తి— మొన్న శనివారం మాయింట్లో భజనచేశారు. ఆయనొక భక్తికీర్తన చాలా బాగాపాడాడు. దానిని మన అమ్మాయి చక్కగా పట్టుకుంది. ఈరోజే ముఖ్య.

తాళాలు గుర్తుచూపించి చిన్న కీర్తనలు మొదలు పెట్టండి.

కడాని కొంచెము అలసిపోయింది. ఆవలించి వెన్ను విరిచింది. బిక్కమొగం వేసికొన్నది.

తి— ఏమమ్మా అట్లా కూర్చున్నావు. కాసేపటికే బడలికా?

సీ— పోనియ్యి. ఇవ్వాళిటికి చాలించండి.

నా— తోటలో కూచుంటే నాకెంతసేపటికయినా విసుగు రాదు. ఇప్పుడక్కడికి పోతే నాకుతలనొప్పి పోతుంది.

పం— ఆ అమ్మాయి యిష్టప్రకారమే పోదాము. రేపటినుంచి అక్కడే కూర్చోవచ్చు.

నా—అమ్మా— ఇప్పుడెపోయి కాసేపు పాడుకుందాముకండి. మీరు కూడ పిట్టల సంగీతము విందురుగాని.

అందరూ తోటలోకి పోయినారు. నాగసాని ముందు పరుగెత్తింది. నాగసాని కాళ్ళచప్పుడు గుర్తు బట్టి పాము పుట్టమీదికి లేచిందిగాని ఆమెతో యితరులు రావడంచూచి తలలోపలికి లాక్కున్నది. పుట్ట సమీపంగావున్నకదంబ చెట్టుమొదట వేసివున్న అరుగు మీద అందరూ కూర్చున్నారు.

నా— పంతులుగారూ సంగీతము ఎక్కడనుంచి వస్తుందండి.

పం— ఎక్కడనుంచా— ఎక్కడనుంచేమిటి? నేర్చుకుంటే వస్తుంది. నోట్లోనుంచి— కంఠంలోనుంచి వస్తుంది.

తి— విభ్రమపడి— కడానీ, ఏమిటమ్మా నీప్రశ్న

నా— ఏమిటిలేదు నాన్నా. సంగీతమ్ము— ఎక్కడనుంచి— వస్తుందో.

అని అంటూ కండ్లుమూసుకొని మొగముపైకెత్తి భూనభోంతరాళమంతా వెతికింది.

తి— దాని పుటక ఎక్కడని? దానిప్రశ్న.

పం— నాభిలోనుంచి బయలుదేరుతుందనుకుంటాను.

నా— వీణెకు నోరూ, బొడ్డూ ఎక్కడవున్నవి?

తి— తుమ్మెదకూడ నోటితో పాడదంటారు.

నా— ఎదురుపొద సంగీతం పాడడంలేదా? చెవులో వేళ్ళు పెట్టుకొని వింటే, లోపల సంగీతమూ— తాళమూ— మద్దెలా వినబడతవి.

తి— ఏమండీ పంతులుగారు సంగీతానికి పుటక ఎక్కడని శాస్త్రం చెపుతుంది?

పం— స్వరస్థానాలు చెప్పివున్నవిగాని సంగీతము ఎక్కడ పుడు తుందని చెప్పగలము?

నా— సంగీతము అంతటావుంది నాన్న. మనుష్యులుపాడితే అపస్వరం వస్తుందిగాని పిట్టపాడితే రాదు. మనుష్యులనోరు అనేక స్వరాలు పలుకుతుంది గాని పిట్టలనోరు ఒక్కొక్కస్వరమే పలుకుతుంది.

తి— అమ్మాయికి ఏమయినా పాట చెపుతారా?

పం— భూపాళంలో ఒక చిన్నపాట చెపుతా. ఆడవాండ్లకు తెల్లవారుజామున పాడుకోవడానికి పనికివస్తుంది. అను

అమ్మా— మేలుకో—

నా— తెల్లవారుజామున కోడి యీరాగంతోనే కూస్తుంది. తాళంగూడ ఇట్లాగేపడుతుంది. కొక్కొ—రో—కో అని.

పం— ఈమె చిత్రమయిన అమ్మాయిలాగుందండి. ఏజంతువు అరిచినా ఒక తాళంకిందికి రాగంకిందికి లాగుతుంది, ఎట్లా కనిపెట్టిందో కాని. ఆ అమ్మాయి అన్నతరువాత పరిక్షిస్తే అన్ని అరుపులూ చాలావరకు ఏడు స్వరాల లోకే వస్తున్నవి.

నా— ఏడుస్వరాలు కాదబ్బాయి. వొకొకపిట్ట ఒకస్వరంలో పాడుతుంది.

పం— ఈ అమ్మాయికి నే సంగీతం చెప్పడంబోయి ఆమెవల్ల నేనే నేర్చుకోవలసి వస్తున్నది.

నా— నీవు కూడ సంగీతం నేర్చుకో నాన్నా. బాగుంటుంది.

తి— నవ్వుతూ— ఏమండీ పంతులుగారూ. నే నిప్పుడు సంగీతం నేర్చుకుంటే వస్తుందా.

పం— రాకేమి— తప్పకుండా వస్తుంది. తమది శ్రావ్యమయిన గొంతుగూడాను.

నా— నీది కోకిలగొంతు నాన్నా. నేర్చుకో చక్కగావస్తుంది

తి— నీవు నేర్చుకొని చెప్పాదువుగానిలే.

నా— నీవు రోజు తోటలోకి రా— పిట్టలు చెపుతవి.

తి— ఏమిటి? ఈమె సంగీతము సాగిస్తారా కొంతకాలం?

పం— జరగనియ్యండి ఏరకంలోకి తేలుతుందో చూతాము

నా— నేను తోటలో అయితే చెప్పుకుంటా

సీ— ఏమిటి తోటలో ఎక్కువ?

క— మొన్న నాన్న నన్ను గానసభకు తీసుకపోయినాడె తోటలో అంతకంటె బాగావుంటుంది.

పం— ఏమిటిక్కడి బాగు?

నా— అక్కడ ఒక్కరిద్దరె పాడతారు. ఇక్కడ వందలపాటలు వినవచ్చు. మఱ్ఱిచెట్టుమీద వేలపిట్టలు కూచోని దువ్వుకుంటూ, ఆడుకుంటూ, ఎగురుతూ, పాడుకుంటూ వుంటవి.

తి— నే నిప్పుడు దివాణం మళ్లీపోవాలె. అగత్యమయిన పని వున్నది. ఈమెతో కూర్చుంటె జాములు నిమిషాలుగా దొర్లిపోతవి.

నా— నాన్నా— నేను పెద్దదాన్నయితే రోజూ దివాణం పోవలెనా?

తి— ఆఁ — తలగుడ్డ పెట్టుకోని రోజూ పోవాలె.

నా— అక్కడ సంగీతం పాడుతుంటారా?

తి— వాండ్లకదే పని— సంగీతం పాడుకుంటూవుంటే అన్న మక్కరలేదా?

నా— అయితే నేపోను. తోటలో ఆడుకుంటూ వుంటా

సీ— అన్నమక్కరలేదా?

నా— సంగీతముంటె అన్నమెందుకు నాన్నా- నేను సంగీతం విటూవుంటే నన్ను అన్నానికి లాక్కపోవద్దని అమ్మతో చెప్పు.

సీ— కూడూ నీళ్ళూ లేకుండ పొద్దుగూకులూ తోటలోనే కూరోచ్చు.

నా— చెప్పనాన్నా అమ్మతోటి.

తి — అన్నం తినకుండా ఎట్లావుంటావు?

నా— సంగీతములో కలిసిపోతా.

తి— సరిపోయ్. ఇవ్వాళిటికి చాలించండి.

అందరూ బయలు దేరుతారు.

నాగసాని పాడుతూపోతుంది.

—* పాట *—

చిత్తారుకొమ్మన మిఠాయిపొట్లం దాచివుంచవే చిలకా
కొత్తారుకొమ్మన కూర్చోనుండి—కూకూ కోయనవే కోకిలా.

——(:0:)——